శ్రీ భవిష్యోత్తర పురాణోక్త

# సూర్యనమస్కార కల్పః

పరిష్కర్త, పూజ్య గురుదేవులు :

బ్రహ్మశ్రీ రాళ్లపల్లి సత్యనారాయణ అవధాని గారు



సంకలనమ్ : ద్విభాష్యం సుబ్రహ్మణ్య శాస్త్రి

R.S.M. SHARMA

పురుహూతికా దేవ్యై నమః

శ్రీ పద్మినీ ఉషాఛాయా సమేత
శ్రీ సవితృ సూర్యనారాయణ స్వామినే నమః

# శ్రీభవిష్యోత్తర పురాణోక్త తృచాకల్పః

భవిష్యోత్తర పురాణోక్త తృచాకల్ప పద్ధతి – ఆదిత్య పురాణోక్త సాధారణ
తృచాకల్ప పద్ధతి తృచ సౌర అరుణ నమస్కార స్వాహాకార పద్ధతులు
సర్వాభీష్ట సిద్ధికర సౌర మంత్రాదులు క్రియా వివరణ సహితము

పరమ పూజ్య గురుదేవులు, వేదమూర్తులైన
బ్రహ్మశ్రీ **రావూరి లక్ష్మీనారాయణ అవధాని** గారి
కృపాలబ్ధమైన పాఠమునకు

పూజ్య గురుదేవులు, వేదమూర్తులైన
బ్రహ్మశ్రీ **రాళ్ళపల్లి సత్యనారాయణావధాని** గారి
క్రియా వివరణ సహితముగా

బుధజన విధేయుడు వేదమూర్తులైన
బ్రహ్మశ్రీ **ద్విభాష్యం వేంకటేశ్వర్లు** గారి కుమారుడు
**సుబ్రహ్మణ్య శాస్త్రి**చే సంకలనము చేయబడి

సోదరుల సహకారముతో శ్రీలక్ష్మి గణపతి బైండింగ్ వర్క్సు,
గోవూరు నందు ముద్రింపించి ప్రకటింపబడియె.

శ్రీనందన నామ సంవత్సర
గురు పూర్ణిమ

మూల్యము
Rs. 160/-

# పూజా సామగ్రి

| | | | |
|---|---|---|---|
| పసుపు | 50 గ్రా | విడి రూపాయలు | 58 |
| కుంకుమ | 50 గ్రా | మామిడికొమ్మలు | తగినన్ని |
| తమలపాకులు | 100 | గరికిపోచలు | కొద్దిగ |
| పోకచెక్కలు | 50 గ్రా॥ | ఆవునెయ్యి | 250 గ్రా॥ |
| అగరవత్తులు | 1 ప్యాకెట్టు | ప్రత్తివత్తులు | 12 |
| కర్పూరం బిళ్ళలు | 20 గ్రా॥ | దీపారాధనకుందులు | 2 |
| బియ్యపుపిండి | 100 గ్రా॥ | హారతి | 1 |
| కొబ్బరికాయలు | 3 | ఘంట | 1 |
| బియ్యము | 1½ కిలోలు | పెద్దరాగిపళ్ళెము (క్రొత్తది) | 1 |
| అరటిపండ్లు | 16 | ఇత్తడిపళ్ళెములు (వాడుకొనేవి) | 2 |
| ఆవుపాలు | 1½ లీ॥ | పటికబెల్లం | 250 గ్రా॥ |
| చక్కెర / బెల్లం | 1½ కి॥లోలు | ఎండుద్రాక్ష | 100 గ్రా॥ |
| ఆవుపేడతో చేసిన పిడకలు | 25 | యాలకులు | 10 గ్రా॥ |
| ఎర్రచందనము | 5 గ్రా॥ | జీడిపప్పు | 100 గ్రా |
| తామరపువ్వులు | 12 (108) | కిస్మిస్ | 50 గ్రా॥ |
| గన్నేరుపువ్వులు (ఎరుపు) | 108 | ఎర్రగోధుమలు | 1½ కిలోలు |
| ఎఱ్ఱ మందారపువ్వులు | 108 | ఎర్రపంచె (క్రొత్తది) | 1 |
| తులసి దళములు | 108 | రాగిచెంబు (క్రొత్తది) | 1 |
| గులాబీ పుష్పములు | 108 | రాగి ఉద్ధరిణి (క్రొత్తది) | 1 |
| తెల్లనువ్వులు | 10 గ్రా॥ | ఎర్ర వస్త్రము (రవికెలబట్ట) | 1 |
| యవలు | 10 గ్రా॥ | అగ్గిపెట్టె | 1 |

## ముఖ్య హోమ ద్రవ్యములు

క్షీరాన్నము, అప్పములు, జిల్లేడిపువ్వులు, గన్నేరు పువ్వులు, యర్ర చందనముతో కలిపిన అక్షతలు, గరికపోచలు, తెల్లనువ్వులు, యవలు, ఆవునెయ్యి, జిల్లేడి సమిధులు, పూర్ణాహుతి ద్రవ్యములు తదితర...

పై వస్తువులు పూజలందు వినియోగించి, తరువాత బ్రహ్మగారికి ఇవ్వవలెను. ద్రవ్యలోభము చూపరాదు

# విషయసూచిక

శ్రీ పద్మినీ ఉషా ఛాయా సమేత
శ్రీ సవితృ సూర్యనారాయణ స్వామినేనమః

# శ్రీ భవిష్యోత్తర పురాణోక్త తృచాకల్ప పద్ధతిః

శ్రీ సూత ఉవాచ ॥

1. శ్లో॥ భక్త్యా కృష్ణం నమస్కృత్య పాన్డవః పర్యపృచ్ఛత ।
తృచామన్త్రస్య మాహాత్మ్యం శ్రోతుమిచ్ఛా మ్యహం ప్రభో॥

శ్రీ కృష్ణ ఉవాచ ॥

2. శ్లో॥ పరంవ్రతం ప్రవక్ష్యామి శృణుపార్థ హ్యనన్యధీః ।
సౌరవైదిక మన్త్రస్య విధిం సర్వ రుజాపహమ్ ॥

3. శ్లో॥ ప్రత్యహం పూజనంతస్య మన్త్రస్య సకలార్థదమ్ ।
అర్ఘ్యంచైవ నమస్కారం సర్వం యద్య చ్ఛృణుష్వతత్ ॥

4. శ్లో॥ తవప్రీత్యా ప్రవక్ష్యామి సర్వలోక హితాయవై ।
సౌరమన్త్రస్య మాహాత్మ్యం ప్రవక్ష్యామి సమాహితః ॥

5. శ్లో॥ ఉద్యన్నద్యేతి మన్త్రోయం సౌరః పాప ప్రణాశనః ।
రోగఘ్నశ్చ ద్విషఘ్నశ్చ భుక్తి ముక్తి ప్రదాయకః ॥

6. శ్లో॥ కణ్వేనతు పురాదృష్టం గుహ్యం పరమ సిద్ధిదమ్ ।
పుత్రస్య రోగనాశాయ ఖ్యాతం లోకహితాయచ ॥

7. శ్లో॥ తేన చారాధితో దేవః స్తుత్వా మన్త్రేణ భాస్కరః ।
తత్రప్రవక్ష్యామి తే సర్వం న్యాసపూజా విధింక్రమాత్ ॥

8. శ్లో॥ ఉద్యన్నద్యే తృచాऽऽదిత్య ముపతిష్ఠే ద్దినే దినే ।
హృద్రోగం నాశయేత్తస్య పరమారోగ్య దాయకమ్ ॥

9. శ్లో॥ రోగీచ జపతే రోగై ర్ముక్తో భాస్కర తుష్టితః ।
ఆరోగ్య మేతత్పరమం జపేన్నిత్య మతన్ద్రితః ॥

10. శ్లో॥ ద్విషన్తమితి చార్ధర్చం యద్విషన్తం జపేత్స్మరన్ ।
అష్టావృత్త్యా జపేన్నిత్యం ద్విషం నాశయతే ధ్రువమ్ ॥

11. శ్లో॥ ఉత్తమ స్తస్య సార్ధంచ ద్విషి ద్వేష ఇతి శృతమ్ ।
హృద్రోగో నాశమాప్నోతి మన్త్రస్యాస్య ప్రభావతః ॥

12. శ్లో॥ సాధకో విధినా నిత్యం స్నాత్వా హ్యనుదితే రవౌ ।
ధౌత శుక్లాంబర ధరః కృత్వా సంధ్యాదికాః క్రియాః ॥

13. శ్లో॥ గోమయే నోపలిప్తేచ శుచి స్స్వాసన మావిశేత్ ।
ప్రాణా న్నిరుధ్య సంకల్ప్య పూజాద్రవ్యాణి శోధయేత్ ॥

14. శ్లో॥ సకేసరాణి పద్మాని కరవీరాణి చార్జున ।
రక్తచందన మిశ్రాణి గన్ధాక్షత కుశానిచ ॥

15. శ్లో॥ మన్డలం రక్తవర్ణేన అత్మాగ్రే చతురస్రకమ్ ।
విరచ్య తత్ర పద్మాని గన్ధ పంకేనవా లిఖేత్ ॥

16. శ్లో॥ తామ్రపాత్ర స్థితం యన్త్రం విధాయ పంకజోపరి ।
అర్ఘ్య పాత్రం తథాతామ్రం గర్భపద్మం తులాస్థితమ్ ॥

17. శ్లో॥ అర్ఘ్యోదకేన సంపూర్య కలశం స్థాపయే త్తతః ।
గఙ్గాం చావాహయే త్తత్ర ముద్రా యాంకుశయా జపన్ ॥

18. శ్లో॥ ఘృణీతి మూల మంత్రేణ ప్రణవాష్టక మన్త్రితమ్ ।
గంధాద్యై రర్చితంతచ్చ అర్ఘ్యం తోయేన పూరయేత్ ॥

19. శ్లో॥ అర్చయే త్పూర్వవ త్తేన అభిమన్త్ర్య తతో జలమ్ ।
ప్రోక్షణీ కరణై స్త్వేవ మాత్మానం సేచయే త్తతః ॥

20. శ్లో॥ న్యాసం కృత్వా తతః పశ్చా ద్విధిరేష ఉదాహృతః ।
ఉద్యన్నద్యే తృచాం తాసాం ఋషిః ప్రస్కణ్వ ఈరితః ॥

21. శ్లో॥ ఛందో నుష్టుప్తథా దేవః సూర్య నారాయణ స్స్మృతః ।
వినియోగ స్తథాకార్యో న్యాసకర్మ త్విదం శృణు ॥

22. శ్లో॥ అనేనైవ విధానేన న్యాసం కృత్వా యథావిధిః ।
ఉద్యే త్యర్ధర్చం ప్రణవ మాయా దీర్ఘ స్వరై ర్యుతమ్ ॥

23. శ్లో॥ అఙ్గుష్ఠాది కరన్యాసం దేహాఙ్గంచ తతఃపరమ్ ।
హస్తయో ర్హృదయే మూర్ధ్ని పాదౌ నాభౌ ముఖేతథా ॥

24. శ్లో॥ చక్షుషోః కవచం శస్త్రం పాదశః క్రమతో న్యసేత్ ।
అనేనైవ విధానేన న్యాసం కుర్యా ద్యథా విధిః ॥

25. శ్లో॥ షడంగం కవచం కృత్వా సౌరమన్త్రం విధింక్రమాత్ ।
ఏవం యః కురుతే న్యాసం ద్వాదశాఙ్గే పదానిచ ॥

26. శ్లో॥ ససర్వరోగ నిర్ముక్తః సర్వోపద్రవ వర్జితః ।
ఏవంన్యస్య మునిర్విప్రః కర్ణికాయా మధః క్రమాత్ ॥

27. శ్లో॥ ఆధారపీఠ పూజాంచ క్రమేణైవ సమర్చయేత్ ।
కర్ణికాయాం న్యసేత్సూర్యం సాఙ్గావరణ భూషితమ్ ॥

28. శ్లో॥ పత్రసంధి స్థితాష్టార దైవతై స్సహ పూజయేత్ ।
పాద్యా ర్ఘ్యా చమనంచైవ మధుపర్కం నివేదయేత్ ॥

29. శ్లో॥ తతస్త్వాచమనం స్నానం వస్త్ర మాచమనం తథా ।
గంధం పుష్పం తథాధూపం దీపం నైవేద్య మేవచ ॥

30. శ్లో॥ తతశ్చ ఫల తామ్బూలం దక్షిణాంచ సమర్పయేత్ ।
అథార్ఘ్య పాత్రమాదాయ పూరయేత్తీర్థవారిణా ॥

31. శ్లో॥ సకేసరాణి పద్మాని కరవీరాణి చార్జున ।
తిల తండుల సంయుక్తం కుశై ర్గంధోద కేనచ ॥

32. శ్లో॥ రక్తచందన మిశ్రాణి కృత్వావై తామ్రభాజనే ।
ధృత్వా శిరసి తత్పాత్రం జానుభ్యాం ధరణీతలే ॥

33. శ్లో॥ మన్త్రపూతం గుడాకేశ అర్ఘ్యం దద్యా ద్గభస్తయే ।
పాదార్థర్చ తృచేనైవ త్రిధా వృత్తం త్రిధా పునః ॥

34. శ్లో॥ దద్యా దర్ఘ్యం సమన్త్రేణ అనులోమ్యైః పునః పునః ।
నిత్యాత్తు ద్విగుణం కుర్యా ద్రవివారే ప్రయత్నతః ॥

35. శ్లో॥ దండవత్ప్రణమే ద్భూమా వర్ఘ్యదాన క్రమేణతు ।
పునశ్చ గన్ధ పుష్పాదీ నుపచారా న్ప్రకల్పయేత్ ॥

36. శ్లో॥ మిత్రాది దేవతాః సర్వా స్తర్పయే న్మార్జయే త్తతః ।
తీర్థస్య గ్రహణం కుర్యా న్మన్త్రేణానేన వా పునః ॥

37. శ్లో॥ విప్రా న్ద్వాదశ శక్త్యావా భోజయే ద్రవివాసరే ।
నమస్కృతి శతాంశేన తతో బ్రాహ్మణ భోజనమ్ ॥

ఇతి శ్రీభవిష్యోత్తర పురాణే తృచాకల్ప విధానం సమాప్తమ్ ॥

# శ్రీభవిష్యోత్తర పురాణోక్త సూర్యనమస్కారకల్పః

## ద్వాదశావరణ పూజాసహితమ్

మూ॥సూ॥ ఆచమ్య ॥ ప్రాణానాయమ్య । ఆదౌ శుభే ముహూర్తే నదీతీరే శుద్ధభూమౌ షోడశ ద్వాదశ హస్తా న్యతర హస్తం మండపం చతుర్ద్వారం కృత్వా। తన్మధ్యే హస్తమాత్రం వేదీంకృత్వా। సూర్యోదయా త్పూర్వం స్నాత్వా। పరిహిత శుక్ల శుచివాసాః పూజాసంభారా న్సంభృత్య మండపమేత్య వేద్యాః పశ్చిమతః ప్రాఙ్ముఖ ఉపవిశ్య॥

*సూర్యనమస్కారములు చేయదలచిన సాధకుడు శుభముహూర్తమున ఆచమనము చేసి ప్రాణాయామము గావించి, నదీతీరమున పరిశుద్ధ ప్రదేశమున పదహారు హస్తములు లేక పన్నెండు హస్తములు లేదా అవకాశమును బట్టి చతురస్రముగా వేదికను సిద్ధము చేసి దానిమధ్యన ఒక హస్తప్రమాణముగా (24 అంగుళములు ఒక హస్తము అనబడును) వేదికను సిద్ధముచేసి ఉంచవలెను. పిమ్మట సాధకుడు సూర్యోదయపూర్వము స్నానముచేసి పరిశుద్ధముగా ఆరవేసిన తెల్లని వస్త్రములను కట్టుకొని పూజాసంభారములతోసహా మండపమువద్దకువచ్చి తూర్పు ముఖముగా కూర్చొని ఆచమనముచేసి ప్రాణాయామము గావించవలెను.*

ఆచమ్య । ఓం కేశవాయస్వాహా । ఓం నారాయణాయస్వాహా । ఓం మాధవాయస్వాహా । గోవింద, విష్ణో, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహా, అచ్యుత, జనార్దన, ఉపేన్ద్ర, హరేః, శ్రీ కృష్ణాయనమః ॥

ప్రాణానాయమ్య ॥ ఉత్తిష్ఠన్తు భూత పిశాచాః ఏతేభూమిభారకాః। ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥ ఓం భూః। ఓం భువః।

ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం స॒త్యం। ఓం తత్స॑వి॒తుర్వరే॑ణ్యం భర్గో॑ దే॒వస్య॑ ధీమహి। ధియో॒ యో నః॑ ప్రచో॒దయా॑త్। ఓమాపో॒ జ్యోతీ॒రసో॒ఽమృతం॒ బ్రహ్మ॒ భూర్భువ॒స్సువ॒రోమ్।

*పిమ్మట క్రింది విధముగా దేశకాలములను ఉచ్చరించి సంకల్పము గావించవలెను.*

మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం। శుభే శోభనే ముహూర్తే। శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్ర మానేన శ్రీ ..... నామసంవత్సరే ...అయనే ......ఋతౌ ..... మాసే ...పక్షే .....(తిథౌ) .....వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్......... గోత్రః .......నామధేయః ధర్మపత్నీ సమేతోహం శ్రీమతః ...... గోత్రస్య ..... నామధేయస్య ధర్మపత్నీసమేతస్య మమఉపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ॥ మమ శరీరే వర్తమాన వర్తిష్యమాణ వాత పిత్త కఫోద్భవ నానాకారణ నిమిత్త జ్వర క్షయ పాండు కుష్ఠుశూల శ్వేతశ్విత్ర అతిసార ధాతుక్షయ వ్రణ మేహ భగందరాది నామక సమస్త ఆమయ నిదాన హేతుభూత దురితనివృత్తిద్వారా క్షిప్రమేవ దీర్ఘాయుః ప్రాప్త్యర్థం..

మహావ్యాధీన్ కుష్ఠాపస్మార హృద్రోగ వ్యథోదర గుల్మ భూర్గ్రదార్శ శోణితార్శః జలోదర భగందర పాండురోగైః కాసశ్వాస హిక్కాది విస్ఫోటక మజీర్ణ శిరోరోగ ప్రమేహాంశ్చ మహావ్యాధీన్నాశయేత్। మమ ఇహజన్మని జన్మని జన్మాంతరకృత మహాపాతకోపపాతక సమస్త పాపక్షయ ద్వారా శ్రీ పద్మినీ ఉషాఛాయా సమేత శ్రీసవితృసూర్యనారాయణముద్దిస్య శ్రీసవితృ సూర్యనారాయణ దేవతా ప్రీత్యర్థం ॥

**మూ॥ మమ... (అముక).. వ్యాధి నిరసనేన శరీరపుష్టి ద్వారా,**

సపరివార సమేత శ్రీసవితృసూర్యనారాయణదేవతా ప్రీత్యర్థం శ్రీభవిష్యోత్తరపురాణోక్త తృచాకల్పవిధినా, న్యాసపూర్వక యంత్రోల్లేఖన పీఠపూజాం సపరివారదేవతా సహిత ప్రధాన దేవతా పూజాంచ తృచైః నమస్కారైః రక్తచందన రక్తాక్షత తిలతండుల యవ దూర్వాంకుర కుశ కరవీర పద్మ అర్జున కుసుమ జలపూరిత తామ్రపాత్రేణ అర్ఘ్యప్రదాన పూజాఖ్యం కర్మ కరిష్యమాణః అదౌ నిర్విఘ్నపరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతి పూజాం కరిష్యే॥ఇతి సంకల్ప్య॥ గంగణపతయేనమః ఇత్యావాహ్య పూజయేత్ ॥ స్వస్తివాచనం కుర్యాత్ ॥

సంకల్పానంతరము గణపతిపూజ, పుణ్యాహవాచనములనుచేసి క్రింది విధముగా ఆచార్య బ్రహ్మాది ఋత్విక్కులను వరించవలెను.

## ఋత్విగ్వరణమ్

**మూ॥ ఆచార్యం ఋత్విజస్య యథావిభవం వృణుయాత్ ॥** (ఋత్విగ్వరణం కుర్యాత్)

ప్రాణానాయమ్య: – ప్రీత్యర్థం మయాకరిష్యమాణ సూర్యనమస్కారాఖ్య కర్మణి ఆచార్యది ఋత్విగ్వరణం కరిష్యే॥

మయాకరిష్యమాణ సూర్యనమస్కారాఖ్య కర్మణి ఆచార్యం త్వామహం వృణే॥

మయా కరిష్యమాణ సూర్య నమస్కారాఖ్య కర్మణి ఋత్విజమ్ త్వామహం వృణే॥ ఇతిక్రమేణ యథావిభవం వృణుయాత్॥

తతః పూర్వనిర్మితవేద్యాం ఆచార్యో రక్తచందనేన కుంకుమేనవా, (శ్వేతతండుల చూర్ణేనవా)

పిమ్మట క్రింది విధముగా పీఠయంత్రమును వేదికపై రక్తచందనముతోగాని, కుంకుమ తోగాని, బియ్యపుపిండితోగాని ముగ్గుగా (షట్కోణము వృత్తము అష్టకోణము ద్వాదశకోణము చతుర్ద్వార సహితముగా చతురశ్రముగా) వేయవలెను.



# శ్రీ సూర్యపీఠయన్త్రమ్

మూ॥సూ॥ షట్కోణం వృత్తం అష్టకోణం ద్వాదశకోణం భూగృహం చతుర్ద్వారయుతం చతుష్కోణం యంత్రం నిర్మాయ ॥



# శ్రీ సూర్యఅర్ఘ్యపాత్రా సాదనయన్త్రమ్

**మూ॥సూ॥ అర్ఘ్యపా(త్రాసాదనార్థం పురతః అష్టదళం చతుర(శ్రంచ నిర్మాయ॥**
**తస్యోపరి సాధారం కలశం నిధాయ । జలేనాపూర్య ॥**

సూర్యభగవానునికి ఇచ్చుఅర్ఘ్యకలశను ఉంచు నిమిత్తము పీఠ యం(త్రమునకు ముందు భాగమున కర్ణికను లిఖించి దానిపైఅష్టదళపద్మమును చతుర(స్రమును లిఖించవలెను. అర్ఘ్యయం(త్రముపై ఆధారమును ఉంచి దానిపై కలశను ఉంచి కలశలో ఉదకమును పూరించవలెను. పిమ్మట కలశములోకూడా ఇదేవిధముగా యం(త్రమువేసి (క్రిందివిధముగా కలశయందు దేవతాహ్వానము చేయవలెను.

అర్ఘ్య పాత్రా సాదన యంత్రము



ఇదం విష్ణుర్విచ(క్రమే (త్రేధానిదధే పదమ్ । సమూఢమస్యపాగ్ం సురే॥

**కలశముఖే విష్ణుమావాహయామి ॥**

కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే। వోచేమ శన్తమగ్ంహృదే॥
కలశ కంఠే రుద్రమావాహయామి॥

బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీ మతస్సురుచో వేనఆవః।
సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠా స్సతశ్చయోని మసతశ్చవివః॥
**కలశమూలే** బ్రహ్మాణమావాహయామి॥

1) ఓం భూర్భువస్సువః। ఆంబ్రాహ్మ్యైనమః। బ్రాహ్మీమావాహయామి॥

2) ఓం భూర్భువస్సువః। ఈంమాహేశ్వర్యైనమః। మాహేశ్వరీ మావాహయామి॥

3) ఓం భూర్భువస్సువః। ఊంకౌమార్యైనమః। కౌమారీమావాహయామి॥

4) ఓం భూర్భువస్సువః। ఋూం వైష్ణవ్యైనమః। వైష్ణవీమావాహయామి॥

5) ఓం భూర్భువస్సువః। ౡం వారాహ్యైనమః। వారాహీమావాహయామి॥

6) ఓం భూర్భువస్సువః। ఐం ఇంద్రాణ్యైనమః। ఇంద్రాణీమావాహయామి॥

7) ఓం భూర్భువస్సువః। ఔం చాముణ్డాయైనమః। చాముణ్డామావాహయామి॥

8) ఓం భూర్భువస్సువః। అః మహాలక్ష్మ్యైనమః। మహాలక్ష్మీమావాహయామి॥
**కలశమధ్యే** అష్ట మాతృకానావాహయామి॥

**కలశ కుక్షౌ** ఓంసముద్రాయ వయునాయ సిన్ధూనాం పతయేనమః। నదీ నాగ్ం సర్వాసాం పిత్రేజుహుతా విశ్వకర్మణే విశ్వాహామర్త్యగ్ం హవిః॥

**తత్ర** సర్వసాగరానావాహయామి.

1. ఓం భూర్భువస్సువః జంబూద్వీపాయనమః। 2. ఓంభూర్భువ

స్సువః ప్లక్షద్వీపాయ నమః । 3. ఓంభూర్భువస్సువః శాల్మలద్వీపాయ నమః। 4. ఓంభూర్భువస్సువః కుశద్వీపాయనమః। 5. ఓంభూర్భువస్సువః క్రౌంచద్వీపాయ నమః। 6. ఓంభూర్భువస్సువః శాకద్వీపాయ నమః । 7. ఓం భూర్భువస్సువః పుష్కరద్వీపాయ నమః ॥

ఓం స్యోనా పృథివి భవా నృక్షరా నివేశనీ । యచ్ఛాన శ్శర్మ స ప్రథాః ॥

సప్తద్వీప సహిత వసున్ధరా మావాహయామి ॥

ఓం అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్। హెూతారం రత్న ధాత మమ్ ॥

ఋగ్వేదమావాహయామి ॥

ఓంఇషేత్వోర్జేత్వా వాయవస్థో పాయవస్థ దేవోవ స్సవితా ప్రార్పయతు శ్రేష్ఠ త మాయ కర్మణ ఆప్యాయధ్వ మఘ్నియా దేవభాగ మూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీ రనమీవా అయక్ష్మామావస్తేన ఈశత మాఘశగ్ంసో రుద్రస్య హేతిః పరివోవృణక్తు ధ్రువాఅస్మిన్ గోపతౌస్యాత బహ్వీర్యజమానస్య పశూన్పాహి॥

యజుర్వేదమావాహయామి॥

ఓంఅగ్న ఆయాహి వీతయే గృణానో హవ్య దాతయే । నిహెూతా సత్సి బర్హిషి॥

సామవేదమావాహయామి ॥

ఓంశంనో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే । శంయో రభి స్రవన్తునః॥

అథర్వవేదమావాహయామి ॥

శిక్షా, వ్యాకరణ, నిరుక్త, ఛన్ద, జ్యోతిష, కల్పసహితం చతుర్వేదానావాహయామి॥

ఓం బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీ మతస్సురుచో వేనఆవః ।
సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠా స్సతశ్చయోని మసతశ్చవివః ॥
కలశే బ్రహ్మాణం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం బ్రహ్మాణ మావాహయామి ॥

ఓం ఇమంమే వరుణ శ్రుధీ హవ మద్యాచ మృడయ । త్వామ వస్యురాచకే॥
కలశే వరుణం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం వరుణ మావాహయామి ॥

ఓంఇమంమే గంగే యమునే సరస్వతి సుతుద్రిస్తోమగ్ం సచతాపరుష్ణియా।
అసిక్నియా మరుద్వృధే వితస్తయార్జీకీయే శృణుహ్యా సుషోమయా ॥
ఓం నమోభగవత్యశేష తీర్థాలవాలే శివజటాజూటాధిరూఢే ఏహ్యేహి గంగే గంగామ్బికే స్వాహా॥ ఇతి **కలశే** గంగామావాహ్య॥

ఈ క్రింది మంత్రము చెప్పి కలశయందు పద్మార్జున కరవీర (తామర, ఏరుమద్ది, గన్నేరు) పుష్పములను ఉంచవలెను.

ఓంఆయనేతే పరాయణే దూర్వా రోహన్తు పుష్పిణీః ।
హ్రదాశ్చ పుణ్డరీ కాణి సముద్రస్య గృహా ఇమే ॥
**కలశే** పద్మ అర్జున కరవీర పుష్పాణి నిక్షిప్య ॥

ఈ క్రింది మంత్రము చెప్పి కలశయందు నువ్వులు, బియ్యమును ఉంచవలెను.

ఓం ఓషధయ స్సంవదన్తే సోమేన సహరాజ్ఞా ।
యస్మైకరోతి బ్రాహ్మణ స్తగ్ం రాజన్పారయామసి ॥
ఇతి మంత్రేణ **కలశే**తిలతండులాన్నిక్షిప్య ॥

ఈ క్రింది మంత్రము చెప్పి కలశయందు రక్త (ఎఱ్ఱ) చందనమును ఉంచవలెను.

ఓం గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।

ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోప హ్వయే శ్రియమ్॥

ఇతికలశే రక్తగన్ధం నిక్షిప్య॥

క్రింది మంత్రము చెప్పి కలశయందు **అంకుశ** ముద్రచే సూర్యమండలమున గల తీర్థములను ఆకర్షణచేసీ కలశయందుఉంచి ***గాలినీ*** ముద్రను ప్రదర్శించి ***గరుడ*** ముద్రచే నిర్విషీకరణచేసి **ధేను**ముద్రచే అమృతీకరణచేసి అమృతేశ్వరిని ఆవాహన చేయవలెను.

**కలశే** క్రోం ఇత్యఙ్కుశ ముద్రయా సూర్యమండలా త్తీర్థానాకృష్య। **ఫట్** గాలినీ ముద్రాం ప్రదర్శ్య। **క్షిం** గరుడముద్రయా నిర్విషీకృత్య॥ **వం** ధేనుముద్రయా అమృతీకృత్య॥ అమృతే అమృతవర్షిణీ అమృతోద్భవాం అమృతం శ్రావయ శ్రావయ స్వాహా॥

పిమ్మట కలశ యందు **శంఖ, చక్ర, మత్స్య** ముద్రాదులను ప్రదర్శించి కలశయందు అష్టదళ పద్మమును లిఖించి, ఎనిమిదిమార్లు మూలమంత్రముచెప్పి అభిమంత్రించి పిమ్మట సూర్య ద్వాదశకళలను ఆవాహనచేయవలెను.

శంఖముద్రయా అవష్టభ్య। చక్రముద్రాం ప్రదర్శ్య। మత్స్య ముద్రయా దాప్య॥ తతః కలశే అష్టదళపద్మం విలిఖ్య॥

మూలేన అష్టవారమభిమన్త్ర్య॥ సూర్యద్వాదశ కళాః యజేత్॥

**సూర్యకళాః**॥ కంభం తపినీకళాయైనమః। ఖంబం తాపినీ కళాయై నమః। గంఫం ధూమ్రాకళాయైనమః। ఘంపం మరీచికళాయైనమః। ఙంనం జ్వాలినీ కళాయైనమః। చంధం రుచికళాయైనమః। ఛందం సుషుమ్నా కళాయైనమః। జంథం భోగదాకళాయైనమః। ఝంతం విశ్వాకళాయై నమః। ఞంణం బోధినీ కళాయైనమః। టంఢం ధారిణీ కళాయైనమః। ఠండం క్షమా కళాయైనమః॥

క్రింది మంత్రము చెప్పి కలశయందు సూర్య భగవానుని ఆవాహన చేసి ప్రాణప్రతిష్ఠ చేయవలెను.

ఓంఆసత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ ।
హిరణ్యయేన సవితా రథేనా౽౽దేవోయాతి భువనా విపశ్యన్ ॥
ఓంఅసునీతే పునరస్మాసు చక్షుఃపునః ప్రాణమిహనో ధేహి భోగమ్ ।
జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరన్త మనుమతే మృళయాన స్వస్తి ।
అమృతంవై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వయతే ॥

పిమ్మట కలశోదకమును దేవునిపై, తనపై పూజాద్రవ్యములపై చల్లి తదుపరి భూతశుద్ధిని చేయవలెను.

సూ॥ కలశోదకేన దేవమాత్మానం పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య ।
తతః భూశుద్ధి భూతశుద్ధ్యాదికం విధాయ ॥

## ఘంటానాదమ్

క్రింది విధముగా ఘంటను ఆధారముపై నుంచి పంచోపచారములచే పూజించి ఘంటానాదము గావించి మరలా ఆధారముపై ఘంటను ఉంచవలెను.

ఆధారోపరి ఘంటాంనిధాయ పంచోపచారై స్సంపూజ్య ఘంటాం వాదయన్॥

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసామ్ ।
కుర్యాద్ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనమ్ ॥

ఇతి ఘంటానాదం కృత్వా॥

## భూ శుద్ధిః

పరిశుద్ధమైనభూమిపై ఆసనమునుపరచి కుడిచేతియందు జలమునుతీసుకుని సౌః అను మంత్రమును పన్నెండుమార్లు ఉచ్చరించి ఆ జలమును ఆసనముపై ప్రోక్షించి ఈ క్రింది మంత్రమును పఠించి ఆసనమును పూజించి, ఆ ఆసనముపై సాధకుడు కూర్చుండవలెను.

ఆసనమాస్తీర్య। దక్షిణహస్తే జలంగృహీత్వా। సౌః ఇతి ద్వాదశ వార మభిమన్త్ర్య । తజ్జలేన మూలమన్త్రేణ ఆసనం ప్రోక్షయేత్ ॥

అస్యశ్రీ ఆసనమన్త్రస్య । పృథివ్యాః మేరుపృష్ఠ ఋషిః। కూర్మో దేవతా। సుతలంఛన్దః । ఆసనే వినియోగః ॥

శ్లో॥ చతురస్రాం ధేనురూపాం పీతాం కూర్మో పరిస్థితామ్ ।
శతకోటి యోజనగాం పృథ్వీం ధ్యాయే సమాసనే ।
పృథ్వీత్వయా ధృతాలోకా దేవిత్వం విష్ణునాధృత ।
త్వంచ ధారయ మాందేవీ పవిత్రం కురుచాసనమ్ ॥

ఓం యోగాసనాయనమః। ఓం వీరాసనాయనమః । ఓం శరాసనాయ నమః । ఓం హ్రీం ఆధారశక్తి కమలాసనాయనమః॥

ఇతిపుష్పాక్ష తైరాసన మభ్యర్చ్య । ఆసనే ఉపవిశేత్ ॥

## దీపారాధనమ్

క్రిందివిధముగా దీపమునుపూజించి దీపమువెలిగించి క్రింది మంత్రమును పఠించి దీపమునకు పుష్పాంజలిని ఈయవలెను.

ఓం రక్తద్వాదశ శక్తియుక్తాయ దీపనాథాయనమః ॥
ఇతి దీపే పుష్పాంజలిం వికిరేత్ ॥

**ఓం రం సహస్రారహుంఫట్ ॥** (ఇతి సుదర్శనేన దిగ్బన్ధనం కృత్వా)

క్రింది మంత్రమునుపఠించి సాధకుడు తనచేతిలో జలమునుపోసుకుని తనచుట్టూ ఆనీరు పడునట్లు త్రిప్పి వహ్ని ప్రాకారమును ఏర్పాటు చేసుకొని క్రింది విధముగా భూతశుద్ధి గావించవలెను.

**ఓం నమోభగవతి జ్వాలామాలిని దేవి సర్వభూత సంహారకారికే జాతవేదసి జ్వలన్తి ప్రజ్వలన్తి జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల హుం రంరం హుంఫట్ స్వాహా॥**

ఇతిజలధారయా వహ్నిప్రాకారత్రయం విభావ్య। భూతశుద్ధిం కుర్యాత్॥

## భూత శుద్ధిః

(క్రింది మొదటిమంత్రముచే ఎడమముక్కు రంధ్రమునుండి గాలినిపీల్చి రెండవ మంత్రముచే కుంభించి మూడవ మంత్రముచే కుడిముక్కుతో గాలిని వదలవలెను)

యం సంకోచశరీరం శోషయ శోషయ స్వాహా ।

రం దహ దహ పచ పచ స్వాహా ।

హంసస్సోఽహం అవతర అవతర శివపథాజ్జీవ సుషుమ్నాపథేన ప్రవిశప్రవిశ మూలశృంగాట ముల్లసోల్లస జ్వలజ్వల ప్రజ్వలప్రజ్వల హంస స్సోఽహం స్వాహా ॥ (ఇదే ప్రాణాయామ విధానము)

ముందుగా రచించిన పీఠయంత్రముపై అర్ఘ్య (రాగి పళ్ళెము) పాత్రను ఉంచి దాంట్లో నీరుపోసి, ఆనీటిలో క్రిందివిధముగా సూర్యయంత్రమును లిఖించవలెను.

మూ॥సూ॥ నిర్మితం యంత్రం కేవలవేద్యాం స్థాపయేత్ ॥పీఠమధ్యే రచిత యంత్రస్యోపరి తామ్రపాత్రం నిధాయ॥తామ్రపాత్రేజలమాపూర్య।తస్మిన్జలే రవిచక్రంవిలిఖ్య॥

## తామ్రపాత్రే సౌర జలపూజన యన్త్రమ్

### అథ రవి చక్ర లక్షణమ్

సూర్యపీఠముపై ఉంచిన రాగి పళ్ళెములో బిందు, త్రికోణ, వృత్త, షట్కోణ, వృత్తద్వయ, అష్టదళ, వృత్త, ద్వాదశదళ, భూపురత్రయ, చతుర్ద్వారములతో యంత్రమును లిఖించవలెను.

మూ॥శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి రవేశ్చక్ర మనుత్తమమ్ ।
బిందుస్త్రికోణ వృత్తంచ షట్కోణం వృత్త యుగ్మకమ్ ।
పశ్చాదష్టదళం ప్రోక్తం ద్వాదశారం సకర్ణికమ్ ।
భూపురం త్రితయం పశ్చాచ్చతుర్ద్వారం రవేః క్రమాత్ ॥
ఇతిరవిచక్ర లక్షణమ్॥



## మంటప దేవతా పూజ

పిమ్మట క్రింది వాక్యములను పలికి మండప దేవతలను వాస్తు పురుషుని పూజించి ద్వాదశాంగన్యాసమును చేసుకొనవలెను.

**మూ॥ సూ॥ తత్ర మణ్డప దేవతాభ్యోనమః। ఇతి మణ్డపంసంపూజ్య॥**

**వాస్తోష్పతయే బ్రహ్మణే నమః । ఇతి వాస్తోష్పతిం పూజయిత్వా ॥**

**మూ॥సూ॥ తతః ద్వాదశాంగ న్యాసం కుర్యాత్ ॥**

## ద్వాదశాంగ న్యాసః

క్రింది మంత్రములనుపలికి ఉదకముతో రెండు చేతులతో సర్వాంగములను ముట్టుకొని గురువులకు నమస్కరించవలెను.

ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్ ।
హృద్రోగం మమ సూర్య హరిమాణంచ నాశయ ॥ 1 ॥

శుకేషుమే హరిమాణం రోపణాకా సుదధ్మసి ।
అథోహారిద్రవేషుమే హరిమాణం నిదధ్మసి ॥ 2 ॥

ఉదగాదయమాదిత్యో విశ్వేన సహసా సహ ।
ద్విషన్తం మహ్యం రన్ధయన్మో అహం ద్విషతే రధమ్ ॥ 3 ॥

**మూ॥సూ॥ ఇతి తృచేన సూక్తేనోదకేన పాణినాంగాన్యభిమృశ్య॥**

మూ॥ గుం గురుభ్యోనమః । పం పరమగురుభ్యోనమః ।
పం పరాపరగురుభ్యోనమః ॥

పిమ్మట క్రిందివిధముగా ఋష్యాది న్యాసములను గావించవలెను. ఋషిని స్మరించి శిరస్సును, ఛందస్సుతో ముఖమును, పరమాత్మని ధ్యానించి హృదయమును, బీజమును ఉచ్చరించి నాభిని, కీలకమును ఉచ్చరించి మూలాధారమును స్పృశించవలెను.

## ద్వాదశాంగన్యాసః

కణ్వపుత్రః ప్రస్కణ్వఋషయేనమః శిరసి । అనుష్టుప్ఛందసే నమః ముఖే । సర్వరోగాపహర్తా జగదాత్మా శ్రీసూర్యోదేవతా హృదయే। జ్ఞాననేత్రే శ్రీంబీజాయనమః నాభౌ। హ్రీం కీలకాయనమః మూలాధారే ॥ ద్వాదశాంగ న్యాసే వినియోగః॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కుడిచేతిని స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రాం ఉద్యన్నద్య మిత్రమహః ।
కుకృతాన్మిత్రో రక్షతుమామ్ ఓం హ్రాం దక్షిణహస్తాయనమః ॥1॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమ చేతిని స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రీం ఆరోహన్నుత్తరాన్దివమ్ ।
విహితాకరణాద్రవీ రక్షతుమామ్।ఓం హ్రీం వామహస్తాయనమః ॥2॥

క్రింది వాక్యమును ఉచ్చరించి హృదయమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రాం హృద్రోగం మమ సూర్య ।
సూర్యోజ్ఞానాత్వనామయం కరోతుమామ్। ఓంహ్రాం హృదయాయనమః ॥3॥

క్రింది వాక్యమును ఉచ్చరించి నుదుటిని స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రైం హరిమాణంచ నాశయ ।
శిరోవనామాద్భానూ రక్షతుమామ్ । ఓం హ్రైం మూర్ధ్నేనమః ॥4॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కుడిపాదమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రౌం శుకేషుమే హరిమాణమ్ ।
ప్రతిషిద్ధ గమనాత్ఖగో రక్షతుమామ్। ఓం హ్రౌం దక్షిణపాదాయనమః ॥5॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమపాదమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రః రోపణాకాసుదధ్మసి ।
విహితాగమనాత్పూషా రక్షతుమామ్।ఓం హ్రః వామపాదాయ నమః॥6॥

క్రింది వాక్యమును ఉచ్చరించి బొడ్డును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రాం అథోహారిద్రవేషుమే ।
తమోజాడ్యాద్ధిరణ్యగర్భో రక్షతుమామ్ । ఓం హ్రాం నాభ్యైనమః ॥7॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ముఖమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః।ఓం హ్రీం హరిమాణం నిదధ్మసి ।
ప్రతిషిద్ధజిహ్వావ్యాపారాత్సర్వతో మరీచీరక్షతుమామ్ ।
ఓం హ్రీం ముఖాయనమః ॥ 8 ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కుడి కన్నును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రూం ఉదగాద్దయమాదిత్యః । అంధ్యా ద్విహితా దర్శనాచ్చాదిత్యోరక్షతుమామ్। ఓంహ్రూం దక్షిణనేత్రాయనమః ।।9।।

క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమ కన్నును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రైం విశ్వేన సహసాసహ । ప్రతిషిద్ధ దర్శనాత్సవితా రక్షతుమామ్ ।ఓం హ్రైం వామనేత్రాయనమః।।10।।

క్రింది వాక్యమును ఉచ్చరించి కుడి ఎడమ చేతులను వ్యత్యసముగా పట్టుకొని కవచమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః। ఓం హ్రౌం ద్విషన్తంమహ్యాంరన్ధయన్న్ । సర్వరోగేభ్యోరిష్టే భ్యశ్చార్కో రక్షతుమాం।ఓం హ్రౌం కవచాయహుం ।।11।।

క్రింది వాక్యమును ఉచ్చరించి అస్త్రముద్రచే అస్త్రమును వేయవలెను.

ఓం భూర్భువస్సువః। ఓం హ్రః మో అహంద్విషతేరధమ్ । సర్వశత్రు కృత్యాభ్యోనిష్టేభ్యశ్చ భాస్కరో రక్షతు మామ్ ।ఓం హ్రః అస్త్రాయఫట్।।12।।

## అథషడంగన్యాసః

(ముందుగా కరన్యాసము చేసుకుని పిమ్మట అంగన్యాసము చేయవలెను)

క్రింది వాక్యమును ఉచ్చరించి రెండు చూపుడు వ్రేళ్ళతో బ్రొటన వ్రేళ్ళను స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః ఓంహ్రాంఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్। ఓం హ్రాం మిత్ర రవిభ్యాం నమః। అంగుష్ఠాభ్యాం నమః ।।1।।

క్రింది వాక్యమును ఉచ్చరించి రెండు బ్రొటనవ్రేళ్ళతో చూపుడు వ్రేళ్ళను స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః। ఓం హ్రీం హృద్రోగం మమ సూర్య హరిమాణంచ నాశయ।ఓంహ్రీంసూర్య భానుభ్యాంనమః । తర్జనీభ్యాంనమః।।2।।

క్రింది వాక్యమునుఉచ్చరించి రెండుబ్రొటనవ్రేళ్ళతో మధ్యవ్రేళ్ళను స్పృశించ వలెను.

ఓం భూర్భువస్సువః ।ఓం హ్రూం శుకేషుమేహరిమాణం రోపణాకాసుదధ్మసి। ఓం హ్రూం ఖగపూషభ్యాంనమః। మధ్యమాభ్యాంనమః ॥3॥

క్రింది వాక్యమును ఉచ్చరించి రెండుబ్రొటన వ్రేళ్ళతో ఉంగరపువ్రేళ్ళను స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రైం అథో హారిద్ర వేషుమే హరిమాణం నిదధ్మసి। ఓం హ్రైం హిరణ్యగర్భమరీచిభ్యాంనమః। అనామికాభ్యాం నమః ॥4॥

క్రింది వాక్యమును ఉచ్చరించి రెండు బ్రొటన వ్రేళ్ళతో చిటికెన వ్రేళ్ళను స్పృశించవలెను.

ఓంభూర్భువస్సువః ఓంహ్రౌంఉదగాద్దయమాదిత్యోవిశ్వే నసహసా సహ। ఓం హ్రౌం ఆదిత్య సవితృభ్యాం నమః। కనిష్ఠికాభ్యాంనమః ॥5॥

క్రింది వాక్యమును ఉచ్చరించి రెండు చేతులను కరతల కరపృష్ఠములను స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రః ద్విషన్తం మహ్యాం రన్ధయన్మో అహం ద్విషతే రధమ్। ఓం హ్రః అర్కభాస్కరాభ్యాంనమః। కరతల కరపృష్ఠాభ్యాం నమః ॥6॥

క్రింది వాక్యమును ఉచ్చరించి హృదయమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓంహ్రాంఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్। హ్రాం మిత్రరవిభ్యాంనమః । హృదయాయనమః ॥1॥

క్రింది వాక్యమును ఉచ్చరించి శిరస్సును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః । ఓం హ్రీం హృద్రోగం మమ సూర్య హరిమాణంచ నాశయ । ఓం హ్రీం సూర్య భానుభ్యాం నమః । శిరసేస్వాహా ॥2॥

క్రింది వాక్యమును ఉచ్చరించి శిఖను స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః। ఓంహ్రూం శుకేషుమేహరిమాణం రోపణాకా

సుదధ్మసి। ఓంహ్రూం ఖగపూషభ్యాంనమః। శిఖాయై వషట్ ॥3॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కవచమును స్పృశించవలెను.

ఓం భూర్భువస్సువః। ఓం హ్రైం అథోహారిద్రవేషుమే హరిమాణం

నిదధ్మసి। ఓం హ్రైం హిరణ్యగర్భమరీచిభ్యాంనమః। కవచాయహుం॥4॥

క్రింది వాక్యమును ఉచ్చరించి నేత్రత్రయమును స్పృశించవలెను.

ఓంభూర్భువస్సువః।ఓంహ్రౌంఉదగాదయమాదిత్యోవిశ్వేన సహసా

సహ। ఓం హ్రౌం ఆదిత్య సవితృభ్యాం నమః। నేత్రత్రయాయ వౌషట్॥ 5॥

క్రింది వాక్యమును ఉచ్చరించి అస్త్రమును స్పృశించవలెను.

ఓంభూర్భువస్సువః।ఓంహ్రఃద్విషన్తం మహ్యం రన్ధయన్మో అహం ద్విషతే రధమ్।

ఓం హ్రః అర్కభాస్కరాభ్యాంనమః। అస్త్రాయ ఫట్ ॥6॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కవచమువలే శరీరమంతటయు వ్యాపకమును గావించవలెను.

ఓం ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్ ।

హృద్రోగం మమసూర్య హరిమాణంచ నాశయ ॥

శుకేషుమేహరిమాణం రోపణాకాసుదధ్మసి ।

అథోహారిద్ర వేషుమే హరిమాణంనిదధ్మసి ॥

ఉదగాదయమాదిత్యో విశ్వేనసహసా సహ ।

ద్విషన్తంమహ్యం రంధయన్మో అహం ద్విషతే రధమ్ ॥3 ఋచః ॥

**కవచత్వేన సర్వాంగే వ్యాపకం విన్యసామితి వ్యాపకమ్ ॥**

(పై న్యాసములు పూర్తిచేసి పీఠపూజ ప్రారంభము చేయవలెను)

## అథపీఠపూజా

యంత్రముక్రింద ఏర్పరచిన సూర్యపీఠముపై పుష్పాక్షతలతో క్రిందివిధముగా పీఠపూజ చేయవలెను.

**యంత్రాథః కల్పితపీఠే ॥** ఓంమండూకాయనమః । ఓంకాలాగ్ని రుద్రాయనమః । ఓంకచ్ఛపాయనమః । ఓంఆధారశక్త్యైనమః । ఓం మహాసాగరాయనమః । ఓంసూర్యలోకాయనమః । ఓంసూర్యలోకస్థ సురేభ్యో నమః । ఓంకల్పవృక్షేభ్యోనమః । ఓంరత్నవేదికాయైనమః । ఓంరత్న సింహాసనాయనమః । ఓంధర్మాయనమః । ఓంజ్ఞానాయనమః । ఓంవైరా గ్యాయనమః । ఓంఐశ్వర్యాయనమః । ఓంఅధర్మాయనమః । ఓంఅజ్ఞానా యనమః । ఓంఅవైరాగ్యాయనమః । ఓంఅనైశ్వర్యాయనమః । ఓంఅనన్తాయ నమః॥ ఓంఆనన్దమయకందాయనమః । ఓం సంవిన్నాళాయ నమః । ఓం కాలసరోజాయనమః । ఓంప్రకృతిపత్రేభ్యోనమః । ఓం వికారమయ కేసరేభ్యో నమః । ఓంపంచాశద్వర్ణకర్ణికాయైనమః । ఓం అర్కమండలాయ నమః । ఓం చన్ద్రమండలాయనమః । ఓం వహ్నిమండలాయనమః । ఓం సత్త్వాయనమః । ఓంరజసేనమః । ఓంతమసేనమః । ఓంఆత్మనేనమః । ఓంఅన్తరాత్మనేనమః । ఓంపరమాత్మనేనమః । ఓంజ్ఞానాత్మనేనమః । ఓంజ్ఞానతత్త్వాయ నమః । ఓం మాయాతత్త్వాయనమః । ఓంకాల తత్త్వాయ నమః । ఓం విద్యాతత్త్వాయనమః । ఓంపరతత్త్వాయనమః । ఓంవిమలాయై నమః । ఓంఉత్కర్షిణ్యైనమః । ఓం జ్ఞానాయై నమః । ఓం క్రియాయైనమః । ఓంయోగాయై నమః । ఓంప్రహ్వాయైనమః । ఓంసత్యాయైనమః॥ ఓం ఈశాన్యైనమః । ఓంఅనుగ్రహాయైనమః । ఓంహ్రీం సర్వాదిశక్తి కమలాయ నమః ॥

మూ॥సూ॥ ఇతిపీఠమంత్రాః॥ ఏతాః పీఠదేవతా ఆవాహ్య॥

పంచోపచారై స్సంపూజ్య । అన్తర్యాగంకుర్యాత్ ॥

(తరువాత అంతర్యాగము, అనగా తనకు తానుసూర్యునిగాభావన చేసుకొని ఆత్మపూజ చేసుకొనవలెను)

## అథ అన్తర్యాగః

ఉదారజ్ఞానక్షేత్రస్వరూప శ్రీసూర్యచరణ కమల భక్తిసిద్ధ్యర్థం పరమాత్మ స్వరూప సిద్ధ్యర్థంచ అన్తర్యాగం కరిష్యే । ఇతి సంకల్ప్య వదేత్॥

శ్లో ॥ సహస్రపురుషాదిత్యః సహస్రకిరణో రవిః ।

సహస్రశీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్ ॥

యోసావాదిత్యే పురుషః సోసావహం సూర్యోహం విశ్వరూపపరమాత్మనే నమః ॥ఇతి॥

## అథ ఆత్మపూజ

క్రింది మంత్రమును చెప్పి సాధకుడు తన నుదిటిపై గంధమును ఉంచుకొని పుష్పమాలలను అలంకరించుకొని తనహృదయమునగల పరమాత్మకు క్రింది శ్లోకమును పలికి నమస్కరించుకొనవలెను.

గన్ధద్వారామానందః కర్దమః శ్రీరనుష్టుప్ । ఆత్మపూజనే వినియోగః ॥

గంధద్వారాం ...శ్రియమ్ ॥ గన్ధద్వారామితి లలాటే గన్ధాక్షతాదిన్యస్య

పుష్పమాల్యాదీని స్వశిరసిన్యస్య । నమోస్త్వనన్తా యేత్యుక్త్వా ॥

శ్లో॥ నమోస్త్వనన్తాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే

సహస్రనామ్నే పురుషాయశాశ్వతే సహస్రకోటి యుగధారిణేనమః ॥

సూర్యాత్మనేనమః ॥ ఇతి కరపుటేన హృద్యాత్మానం నమస్కుర్యాత్॥

(తరువాత క్రింది విధముగా ఆవరణ పూజలు చేయవలెను)

క్రింది పటములో చూపిన విధముగా 1వ ఆవరణము నుండి 9వ ఆవరణము వరకు ఆవరణ దేవతలను అష్టదళములయందు పూజించవలెను.

**1 నుండి 9 వరకు ఆవరణలు**




## ౧ ప్రథమావరణమ్ ౧

క్రింది విధముగా తామ్రపాత్ర యందుగల యంత్రముపైగల అష్టదళముల మధ్యన తూర్పు మొదలుకొని ప్రదక్షిణక్రమముగా మొదటిఆవరణ దేవతలను క్రిందినామ మంత్రములతో ఆవాహనచేసి ఉపచారములచే పూజించిపుష్పాంజలిసమర్పించవలెను.

**మూ॥సూ॥ అథాష్టావరణదేవతాపూజా । తత్రాష్టదళమధ్యే ప్రాగాదిక్రమేణ పూజ్యాః ॥**

**శ్లో ॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।**

**అనుజ్ఞాం దేహిదేవేశ ప్రథమావరణాయమే॥**

**ఇతి సంప్రార్థ్య । పుష్పాంజలిందత్వా ॥**

ఓంమార్తాండాయనమః । ఓంభానవేనమః । ఓంఆదిత్యాయనమః ।
ఓంహంసాయనమః । ఓంసూర్యాయనమః । ఓందివాకరాయనమః ।
ఓం తపనాయనమః । ఓం భాస్కరాయనమః ॥ 8 ॥

పిమ్మట అష్టదళమధ్యమునగల కర్ణికయందు క్రింది మాసదేవతలలో ఏ మాసమున సూర్యుని పూజించుచున్నామో ఆ మాసాధిపతిని ఒక్కరిని మాత్రము ఆవాహన చేయవలెను.

ఉదా.: సూర్యుని పూజించుచున్న ప్రస్తుత మాసము "మాఘమాసము" అయినచో "ఓం విష్ణవే నమః" అని పూజించిన చాలును.

**మూ॥సూ॥ మధ్యేమండలాధిపతి ర్వర్తమాన మాసాధిపతిః పూజ్యః॥**
**మాసాధిపాశ్చైత్రాదిషు ॥**

| ప్ర | | మూ |
|---|---|---|
| 1. చైత్రమాసాధిపతయే | – | ఓం అరుణాయనమః । |
| 2. వైశాఖమాసాధిపతయే | – | ఓం వేదాంగాయనమః । |
| 3. జ్యేష్ఠ మాసాధిపతయే | – | ఓం భానవేనమః । |
| 4. ఆషాఢమాసాధిపతయే | – | ఓం ఇంద్రాయనమః । |
| 5. శ్రావణమాసాధిపతయే | – | ఓం రవయేనమః । |
| 6. భాద్రపదమాసాధిపతయే | – | ఓం గభస్తయేనమః । |
| 7. ఆశ్వయుజమాసాధిపతయే | – | ఓం యమాయనమః । |
| 8. కార్తికమాసాధిపతయే | – | ఓం సువర్ణరేతసేనమః । |
| 9. మార్గశిరమాసాధిపతయే | – | ఓం దివాకరాయనమః । |
| 10. పుష్యమాసాధిపతయే | – | ఓం మిత్రాయనమః । |
| 11. మాఘమాసాధిపతయే | – | ఓం విష్ణవేనమః । |
| 12. ఫాల్గుణమాసాధిపతయే | – | ఓం సూర్యాయనమః । |

ప్రథమావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

**శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।**
**భక్త్యా సమర్పయేతుభ్యం ప్రథమావరణార్చనమ్ ॥**

## ౨ ద్వితీయావరణమ్ ౨

ద్వితీయావరణము మరల అష్టదళములయందు తూర్పుమొదలుగా ఎనిమిది పీఠశక్తులను మధ్యలోగల కర్ణికయందు తొమ్మిదవశక్తిని ఆవాహన చేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలి సమర్పించ వలెను.

**శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।**
**అనుజ్ఞాం దేహి దేవేశ ద్వితీయా వరణార్చనే ॥**
**మూ॥సూ॥ పునః అష్టదళేషు మధ్యేచ ॥**

ఓం దీప్తాయైనమః । ఓం సూక్ష్మాయై నమః । ఓం జయాయై నమః। ఓం భద్రాయైనమః। ఓం విభూత్యైనమః। ఓం విమలాయై నమః। ఓం అమోఘాయై నమః। ఓంవిద్యుతాయైనమః। మధ్యే ఓం సర్వతోముఖ్యై శ్రియైనమః ॥9 ॥ ద్వితీయావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

**శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।**
**భక్త్యా సమర్పయేతుభ్యం ద్వితీయావరణార్చనమ్ ॥**

## ౩ తృతీయావరణమ్ ౩

తృతీయావరణము మరల అష్టదళములయందు తూర్పుమొదలుగాఎనిమిది మాతృకలను ఆవాహనచేసి ఉపచారములచే పూజించిపుష్పాంజలిసమర్పించవలెను.

**శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।**
**అనుజ్ఞాం దేహి దేవేశ తృతీయా వరణార్చనే ॥**
**మూ॥సూ॥పునఃఅష్టదళేషు తతో ష్టౌమాతరః ॥**

ఓం బ్రాహ్మ్యై నమః । ఓం మాహేశ్వర్యైనమః । ఓం కౌమార్యై నమః। ఓం వైష్ణవ్యైనమః। ఓం వారాహ్యైనమః। ఓం ఇంద్రాణ్యైనమః। ఓం చాముండాయైనమః। ఓం మహాలక్ష్మ్యై నమః ॥ 8 ॥

తృతీయావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయే తుభ్యం తృతీయావరణార్చనమ్ ॥

## చతుర్థావరణమ్

చతుర్థావరణము మరల అష్టదళములయందు తూర్పుమొదలుగాఎనిమిది దేవతలను ఆవాహనచేసి ఉపచారములచే పూజించిపుష్పాంజలిసమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ చతుర్థా వరణార్చనే ॥

మూ॥సూ॥పునః అష్టదళేషు ॥

ఓం ఆరాధ్యాయనమః । ఓం కపిలాయనమః । ఓం సారాయనమః । ఓంప్రభూతాయనమః । ఓందండినేనమః ।ఓం పింగళాయనమః । ఓం ధాత్రేనమః । ఓం విధాత్రేనమః ॥ 8 ॥

చతుర్థావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయే తుభ్యం చతుర్థావరణార్చనమ్ ॥

## పంచమావరణమ్

పంచమావరణము మరల అష్టదళములయందు ఎనిమిది దేవతలను ఆవాహనచేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలిసమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ పంచమా వరణార్చనే ॥

**మూ॥సూ॥పునః అష్టదళేషు ॥**

ఓం ఐరావతాయనమః । ఓం పుండరీకాయనమః । ఓం వామనాయనమః । ఓం కుముదాయనమః । ఓం అంజనాయనమః । ఓం పుష్పదన్తాయ నమః । ఓం సార్వభౌమాయనమః । ఓం సుప్రతీకాయ నమః ॥8 ॥

పంచమావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

**శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।**
**భక్త్యా సమర్పయేతుభ్యం పంచమా వరణార్చనమ్ ॥**

## ౬ షష్ఠావరణమ్ ౬

*షష్ఠావరణము మరల అష్టదళములయందు ఎనిమిదిదేవతలను క్రిందివైపు శేషుని పై భాగమున హిరణ్యగర్భుని ఆవాహనచేసి పూజించిపుష్పాంజలిసమర్పించవలెను.*

**శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।**
**అనుజ్ఞాం దేహి దేవేశ షష్ఠావరణార్చనే ॥**

**మూ॥సూ॥ తతోష్ట దళాగ్రేషు, లోకపాలాన్ ॥**

మూ॥ ఓం ఇంద్రాయనమః । ఓం అగ్నయేనమః । ఓంయమాయ నమః । ఓంనిర్ఋతయేనమః । ఓంవరుణాయనమః ।ఓం వాయవేనమః । ఓం కుబేరాయనమః । ఓం ఈశానాయనమః । **పద్మస్యాధః** ఓంశేషాయ నమః। **ఊర్ధ్వే** ఓం హిరణ్యగర్భాయ నమః ॥10 ॥

షష్ఠావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

**శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।**
**భక్త్యా సమర్పయేతుభ్యం షష్ఠావరణార్చనమ్ ॥**

## ౭ సప్తమావరణమ్ ౭

సప్తమావరణము మరల పై విధముగనే దిక్పాలక స్థానమున ఆయుధములను ఆవాహనచేసి పూజించిపుష్పాంజలిసమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ సప్తామావరణార్చనే ॥

మూ॥సూ॥పునః తత్రైవ ఆయుధదేవతాః ॥

ఓం వజ్రాయుధాయనమః । ఓం శక్త్యాయుధాయనమః । ఓం దండాయుధాయనమః । ఓంఖడ్గాయుధాయనమః । ఓంపాశాయుధాయ నమః । ఓం అంకుశాయుధాయనమః । ఓం గదాయుధాయనమః । ఓం శూలాయుధాయనమః । ఓం చక్రాయుధాయనమః । ఓం పద్మాయుధాయ నమః ॥10 ॥

సప్తమావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయేతుభ్యం సప్తమావరణార్చనమ్ ॥

## ౮ అష్టమా వరణమ్ ౮

అష్టమావరణము మరల అష్టదళములయందు ఎనిమిది దేవతలను, మధ్యన రవిని, ఆవాహనచేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలిసమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ అష్టమావరణార్చనే ॥

మూ॥సూ॥ పునః అష్టదళాన్తరాళేషు రవిం మధ్యే ప్రకల్పయేత్ ॥

ఓం సోమాయనమః । ఓం భౌమాయనమః । ఓం బుధాయనమః ।

ఓం బృహస్పతయేనమః । ఓం శుక్రాయనమః । ఓం శనైశ్చరాయనమః ।
ఓం రాహవేనమః । ఓంకేతవేనమః । (మధ్యే) ఓం రవయేనమః ॥9॥
అష్టమావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయేతుభ్యం అష్టమా వరణార్చనమ్ ॥

## నవమావరణమ్

నవమావరణము మరల అష్టదళములయందు ఎనిమిదిమంది భైరవులను ఆవాహనచేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలి సమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ నవమావరణార్చనే ॥

మూ॥సూ॥ పునః తత్రైవ ॥

ఓం అసితాంగభైరవాయనమః । ఓం రురు భైరవాయనమః । ఓంచండ భైరవాయనమః । ఓంక్రోధభైరవాయనమః । ఓంఉన్మత్త భైరవాయ నమః । ఓం కపాలభైరవాయనమః । ఓం భీషణభైరవాయనమః । ఓం సంహారభైరవాయనమః ॥ 8 ॥

నవమావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయేతుభ్యం నవమావరణార్చనమ్ ॥

తర్వాత పేజీలో చూపబడినప్రకారము పదవ ఆవరణ మరియు పన్నెండవ ఆవరణ ద్వాదశదళములలోనూ పదకొండవ ఆవరణము మాత్రము భూపురము వద్దగల చతుర ద్వారముల వద్ద మధ్యన పఠములో చూపినవిధముగా పూజించవలెను.

## 10. 11. 12 ఆవరణలు

తూర్పు




పడమర

## ౧౦ దశమావరణమ్ ౧౦

దశమావరణము పన్నెండుదళములయందు పన్నెండుమంది దేవతలను ఆవాహనచేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలి సమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ దశమా వరణార్చనే ॥

మూ॥సూ॥ తతో మాసాధిపాః పశ్చిమతః ॥ ద్వాదశదళేషు

ఓం గణపతయేనమః । ఓం దుర్గాయైనమః । ఓం క్షేత్రపాలాయ నమః । ఓంసారథయేనమః ।ఓంఅరుణాయనమః । ఓంస్వప్నాయనమః ।

ఓంఇచ్ఛాయైనమః । ఓం పింగళాయనమః । ఓం హరాయనమః। ఓం స్మరాయనమః । ఓం ఆరాధ్యాయనమః । ఓం సప్తతురంగాయనమః ॥12॥
దశమావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయేతుభ్యం దశమావరణార్చనమ్ ॥

## ౧౧ ఏకాదశావరణమ్ ౧౧

ఏకాదశావరణము నాలుగు ద్వారములయందు, మధ్యన క్రింది దేవతలను ఆవాహనచేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలిసమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ ఏకాదశా వరణార్చనే ॥
మూ॥సూ॥ చతుర్ద్వారేషు, మధ్యేచ ॥

ఓం దండినేనమః । ఓం పింగళాయనమః । ఓం మాసాధిపాయ నమః । ఓం శ్రియైనమః। **మధ్యే** పరమసుఖాయ నమః ॥ 5 ॥
ఏకాదశావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।
భక్త్యా సమర్పయే తుభ్యం ఏకాదశావరణార్చనమ్ ॥

## ౧౨ ద్వాదశావరణమ్ ౧౨

ద్వాదశావరణము పన్నెండుదళములయందు పన్నెండుమంది దేవతలను ఆవాహన చేసి ఉపచారములచే పూజించి పుష్పాంజలిసమర్పించవలెను.

శ్లో॥ సంవిన్మయః పరోదేవః పరామృత రసప్రియః ।
అనుజ్ఞాం దేహి దేవేశ ద్వాదశా వరణార్చనే ॥
మూ॥సూ॥ అథద్వాదశదళేషు ॥

ఓం మిత్రాయనమః । ఓం రవయేనమః । ఓం సూర్యాయనమః । ఓంభానవేనమః । ఓంఖగాయనమః । ఓంపూష్ణేనమః । ఓం హిరణ్యగర్భాయ నమః। ఓం మరీచయేనమః। ఓం ఆదిత్యాయనమః। ఓం సవిత్రేనమః । ఓం అర్కాయనమః । ఓం భాస్కరాయనమః ॥12 ॥

పిమ్మట అరుణాది దేవతలను ఆవాహనచేసి ఉపచారములచే పూజించి సర్వావరణ సహితుడైన శ్రీసూర్యభగవానునికి నమస్కారము చేయవలెను.

**మూ॥సూ॥ తతో ౽రుణాది ॥**

ఓం అరుణాయనమః । ఓం సూర్యాయనమః । ఓం వేదాంగాయ నమః । ఓం భానవేనమః । ఓం ఇన్ద్రాయనమః ।ఓంరవయేనమః । ఓంగభస్తయేనమః । ఓం యమాయనమః । ఓం సువర్ణరేతసేనమః । ఓం దివాకరాయనమః । ఓంమిత్రాయనమః । ఓం విష్ణవేనమః । ఓం నమో భగవతే సర్వావరణ సంపన్నాయ త్రిగుణాత్మధారిణే శ్రీసూర్యాయ సాంగాయ సపరివారాయనమః । ఇతి నమస్కుర్వీత॥

ద్వాదశావరణ స్థితదేవతాభ్యోనమః సర్వోపచారైస్సంపూజ్య ॥

**శ్లో॥ అభీష్ట సిద్ధింమే దేహి శరణాగత వత్సల ।**
**భక్త్యాసమర్పయే తుభ్యం (అఖండా) ద్వాదశావరణార్చనమ్ ॥**

## ప్రాణప్రతిష్ఠాపనమ్

**సూ॥ తతః ప్రాణ ప్రతిష్ఠాపనం కుర్యాత్ ॥**

పిమ్మట ఈక్రిందివిధముగా ఋషిఛందస్సులను ఉచ్చరించి అంగన్యాస కరన్యాసములను గావించి ప్రాణశక్తిని ధ్యానించి లమిత్యాది పంచపూజచేసి యథావిధిగా ప్రాణ ప్రతిష్ఠాపన చేయవలెను.

అస్యశ్రీ సపరివార సమేత శ్రీసూర్యనారాయణ ప్రాణప్రతిష్ఠాపన మహామన్త్రస్య । బ్రహ్మ విష్ణు మహేశ్వరాఋషయః । ఋగ్యజుస్సామాథర్వాణి ఛన్దాంసి । సకల చైతన్య స్వరూపిణీ ప్రాణశ్శక్తిః పరాదేవతా । ఆంబీజమ్ ।

హ్రీంశక్తిః । క్రోంకీలకమ్ । సర్వావరణ పీఠదేవతా సహిత పద్మినీ ఉషా ఛాయాసమేత శ్రీసవితృసూర్యనారాయణదేవతా ప్రాణప్రతిష్ఠాపనే వినియోగః ॥

ఓం ఆం హ్రీం క్రోం అం కం ఖం గం ఘం ఙం ఆం। క్రోం హ్రీం ఆం। పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్మనే । అంగుష్ఠాభ్యాంనమః / హృదయాయనమః ॥

ఓం ఆం హ్రీం క్రోం ఇం చం ఛం జం ఝం ఞం ఈం। క్రోం హ్రీం ఆం। శబ్ద స్పర్శ రూప రస గన్ధాత్మనే। తర్జనీభ్యాంనమః / శిరసేస్వాహా॥

ఓం ఆం హ్రీం క్రోం ఉం టం ఠం డం ఢం ణం ఊం। క్రోం హ్రీం ఆం। త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణాత్మనే। మధ్యమాభ్యాంనమః / శిఖాయై వషట్ ॥

ఓం ఆం హ్రీం క్రోం ఏం తం థం దం ధం నం ఐం। క్రోం హ్రీం ఆం। వాక్పాణి పాద పాయూపస్థాత్మనే। అనామికాభ్యాం నమః / కవచాయ హుం॥

ఓం ఆం హ్రీం క్రోం ఓం పం ఫం బం భం మం ఔం। క్రోం హ్రీం ఆం। వచనాదానగమన విసర్గానందాత్మనే। కనిష్ఠికాభ్యాంనమః/నేత్రత్రయాయ వౌషట్॥

ఓం ఆం హ్రీం క్రోం అం యం రం లం వం శం షం సం హం ళం క్షం అః క్రోం హ్రీం ఆం। మనో బుద్ధి చిత్తాహం కారాత్మనే। కరతల కర పృష్ఠాభ్యాం నమః / అస్త్రాయఫట్ ॥

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బన్ధః । ధ్యానమ్ ॥

**శ్లో॥ రక్తాంబోధి స్థపోతోల్లస దరుణ సరోజాధిరూఢా కరాబ్జైః ।**
**పాశం కోదండమిక్షూద్భవ మణిగణ మప్యంకుశం పంచబాణాన్।**

బిభ్రాణా సృక్కపాలం త్రినయన విలసత్పీన వక్షోరుహాఢ్యా ।
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః ।

శ్లో॥ బ్రహ్మాకంద సముద్భూతం జ్ఞాననాళం సుశోభితమ్ ।
ఐశ్వర్యాష్టదళోపేతం పరం వైరాగ్య కర్ణికమ్ ॥
అధోముఖంచ హృత్పద్మం ప్రణవేనోర్ధ్వమున్నయేత్ ॥

సూ॥ యంత్రే దక్షిణ హస్తంనిధాయ ॥

*సాధకుడు కుడిచేతియందు పుష్పమును ధరించి ఆ పుష్పమును రాగి పళ్ళెములో గల యంత్రముపై ఉంచి క్రింది మంత్రములను ఉచ్చరించి ప్రాణప్రతిష్ఠాపన చేయవలెను.*

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం ఓం హంసః శ్రీ పద్మినీ ఉషా ఛాయా సమేత శ్రీసవితృ సూర్యనారాయణ ప్రాణ ఇహప్రాణాః ॥

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం ఓం హంసః శ్రీ పద్మినీ ఉషా ఛాయా సమేత శ్రీసవితృ సూర్యనారాయణ జీవం ఇహస్థితః ॥

ఓం ఆం హ్రీం క్రోం యం రం ల ం వం శం షం సం హం ళం క్షం ఓం హంసః సర్వావరణపీఠదేవతా సహిత శ్రీ పద్మినీ ఉషా ఛాయా సమేత శ్రీ సవితృ సూర్యనారాయణస్య సర్వేంద్రియాణి వాఙ్మనశ్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణాః ప్రాణా ఇహాగచ్ఛ ఇహతిష్ఠ ఓం భూర్భువస్సువరోమ్ ॥

*పిమ్మట క్రింది శ్లోకమును ఉచ్చరించి సూర్యుని అర్ఘ్యమును సమర్పించి సూర్య మండలాంతర్వర్తియైన సూర్యభగవానుని తన హృదయమున భావించి ఆవాహినీ ముద్రచే పీఠ మధ్యమున పుష్పాంజలితో ఆవాహన చేయవలెను.*

శ్లో॥ ఏహి సూర్య సహస్రాంశో తేజోరాశే జగత్పతేః ।
అనుకంపయ మాంభక్త్యా గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥

మూ॥సూ॥ సర్వావరణ పీఠదేవతాసహిత శ్రీసూర్యఇహాగచ్ఛ ఇహతిష్ఠ ఓం భూర్భువస్సువరోమ్ । సూర్యమణ్డలాదాగత్య హృదయస్త్వేన భావితం సూర్యం ఆవాహనీముద్రయా పీఠమధ్యే పుష్పాంజలి న్యాసేనావాహయేత్ ॥ తతో దేవస్య స్వదేహేచ **"పురుష సూక్త"** న్యాసం కుర్యాత్ ॥అథధ్యానమ్॥

శ్లో॥ **ధ్యేయస్సదా సవితృమణ్డల మధ్యవర్తీనారాయణ స్సరసిజాసన సన్నివిష్టః।**
**కేయూర వాన్మకర కుణ్డలవాన్కిరీటీ హారీహిరణ్మయ వపుర్ధృత శంఖచక్రః ॥**

(పిమ్మట క్రిందివిధముగా తనకు అభిముఖుడైన సూర్యభగవానునికి, తనకు పురుష సూక్తముతో న్యాసము చేసుకొనవలెను)

## ఋగ్వేదోక్త పురుష సూక్తన్యాసః

సహస్ర శీర్షేతి షోడశర్చస్య సూక్తస్య । నారాయణ ఋషిః । అనుష్టుప్ ఛన్దః । శ్రీ సూర్యనారాయణ పరమాత్మాదేవతా । దేవస్య / స్వదేహే పురుష సూక్తన్యాసే వినియోగః ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమపాదమును స్పృశించవలెను.

1. ఓం సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।
సభూమిం విశ్వతోవృత్వా౽ త్యతిష్ఠద్దశాఙ్గులమ్ ॥**వామపాదే** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కుడిపాదమును స్పృశించవలెను.

2. ఓం పురుష ఏవేదం సర్వం యద్భూతంయచ్చభవ్యమ్ ।
ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతిరోహతి ॥ **దక్షపాదే** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమకాలి పిక్కను స్పృశించవలెను.

3. ఓం ఏతావానస్య మహిమా౽తోజ్యాయాంశ్చపూరుషః ।

పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి ॥ **వామజంఘాయామ్** ॥
క్రింది వాక్యమును ఉచ్చరించి కుడికాలి పిక్కను స్పృశించవలెను.

4. ఓం త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహాభవత్పునః ।
తతో విష్వఙ్వ్యక్రామత్ సాసనానశనే అభి ॥ **దక్షజంఘాయామ్** ॥
క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమమోకాలిని స్పృశించవలెను.

5. ఓం తస్మాద్విరాళజాయత విరాజో అధిపూరుషః ।
సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమిమథో పురః ॥ **వామజానుని** ॥
క్రింది వాక్యమును ఉచ్చరించి కుడిమోకాలిని స్పృశించవలెను.

6. ఓం యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత ।
వసన్తోఽస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥ **దక్షజానుని** ॥
క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమమొలను స్పృశించవలెను.

7. ఓం తం యజ్ఞంబర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః ।
తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే ॥ **వామకట్యామ్** ॥
క్రింది వాక్యమును ఉచ్చరించి కుడిమొలను స్పృశించవలెను.

8. ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతస్సంభృతం పృషదాజ్యమ్ ।
పశూన్తాంశ్చక్రే వాయవ్యానారణ్యాన్ గ్రామ్యాశ్చయే ॥ **దక్షకట్యామ్** ॥
క్రింది వాక్యమును ఉచ్చరించి బొడ్డును స్పృశించవలెను.

9. ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుత ఋచస్సామాని జజ్ఞిరే ।
ఛన్దాంసి జజ్ఞిరే తస్మాద్యజు స్తస్మాదజాయత ॥ **నాభౌ** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి హృదయమును స్పృశించవలెను.

10. ఓం తస్మాదశ్వా అజాయన్త యేకేచో భయాదతః ।
గావోహజజ్ఞిరే తస్మా త్తస్మాజ్జాతా అజావయః ॥ **హృదయే** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కంఠమును స్పృశించవలెను.

11. ఓం యత్పురుషం వ్యదధుః కతిధావ్యకల్పయన్ ।
ముఖంకిమస్యకౌ బాహూ కాఊరూ పాదా వుచ్యేతే ॥**కంఠే** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ఎడమ భుజమును స్పృశించవలెను.

12. ఓం బ్రాహ్మణోఽస్య ముఖమాసీ ద్బాహూ రాజన్యఃకృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥**వామభుజే**॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కుడి భుజమును స్పృశించవలెను.

13. ఓం చన్ద్రమా మనసో జాతశ్చక్షోస్సూర్యో అజాయత ।
ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥**దక్షభుజే** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి ముఖమును స్పృశించవలెను.

14. ఓం నాభ్యాఆసీదన్తరిక్షం శీర్ష్ణో ద్యౌస్సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్తథాలోకాం అకల్పయన్న్ ॥ **ముఖే** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి కన్నులను స్పృశించవలెను.

15. ఓం సప్తాస్యా నన్పరిధయ స్త్రిస్సప్త సమిధః కృతాః ।
దేవాయద్యజ్ఞం తన్వానా అబధ్నన్పురుషం పశుమ్ ॥ **నేత్రయోః** ॥

క్రింది వాక్యమును ఉచ్చరించి శిరస్సును స్పృశించవలెను.

16. యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ॥
తేహనాకం మహిమానస్సచన్త యత్రపూర్వే సాధ్యాస్సన్తిదేవాః॥ శిరసి॥

మూ॥సూ॥ ఏహిసూర్యేతి పఠిత్వా ॥

క్రింది మంత్రమును చెప్పి సూర్యుని ఆవాహనము చేసి ముద్రాదులను ప్రదర్శించి పూజించవలెను.

శ్లో॥ ఏహి సూర్య సహస్రాంశో తేజోరాశే జగత్పతేః ।
అనుకమ్పయ మాంభక్త్యాగృహాణార్ఘ్యం నమోస్తుతే ॥
ధ్యేయస్సదా సవితృమణ్డలమధ్యవర్తీ నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః ।
కేయూర వాన్మకర కున్డలవాన్కిరీటీ హారీహిరణ్మయ వపుర్ధృత శంఖచక్రః ॥

ఓం భాస్కరాయవిద్మహే మహద్యుతికరాయ ధీమహి । తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ ॥ మూల మంత్రః॥ ఓం ఘృణి స్సూరియ ఆదిత్యోమ్ ॥ సర్వావరణ పీఠదేవతాసహిత శ్రీపద్మినీఉషాఛాయా సమేత శ్రీసవితృ సూర్యనారాయణం సాంగంసాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం శ్రీ సూర్యనారాయణ మావాహయామి స్థాపయామి పూజయామి॥

ఓం అసునీతే పునరస్మాసు చక్షుఃపునః ప్రాణ మిహనో ధేహిభోగమ్। జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరన్త మనుమతే మృళయానస్స్వస్తి । అమృతంవై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వయతే ॥

ఓం ఘృణి స్సూరియ ఆదిత్యోమ్ ॥

ఓం వాఙ్మ ఆసన్న్ । నసోః ప్రాణః అక్ష్యోశ్చక్షుః కర్ణయోశ్శ్రోత్రమ్

బాహువోర్బలమ్ । ఊరువోరోజః । అరిష్టా విశ్వాన్యంగాని తనూః । తనువామే సహ నమస్తే అస్తు మామాహిగ్ంసీః ॥

సపరివారసమేత శ్రీసూర్యనారాయణ ప్రాణప్రతిష్ఠాపన ముహూర్తస్సు ముహూర్తోఽఽస్తు ॥

**సూ॥ కించిన్ని వేదనం కుర్యాత్ । కృత్వా ॥**

**మూ॥సూ॥ ఆవాహనీముద్రయా ఆవాహయామి ॥ స్థాపినీ, సన్నిధాపినీ, సంరోధినీ, సంముఖీకరణీ, ప్రార్థనీముద్రయా ప్రార్థయామి ॥ ఇతి షణ్ముద్రాః ప్రదర్శయేత్ ॥**

**ఆవాహన స్థాపన సన్నిధాపన సన్నిరోధన సమ్ముఖీకరణ అవగుంఠన సకలీకరణ అమృతీకరణ పరమీకరణ ప్రార్థనీ ముద్రలు మరియు సౌర అష్టాక్షరీ మంత్ర సంబంధమైన ముద్రలను గూర్చి ప్రమాణశ్లోకములు మంత్ర మహార్ణవము నుండి గ్రహించి ఆ శ్లోకములను ఈ గ్రంథము చివర ఇచ్చియున్నాము. ఆ ముద్రాచిత్రములో కూడా రంగుల కాగితములపై ముద్రించి చదువరుల సౌలభ్యము కొరకు ఈ గ్రంథము నందు పొందుపరచియున్నాము. చదువరులు గ్రహించగలరు.**





# శ్రీ సూర్య పూజా విధానమ్

సూ॥ అథపురుషసూక్త, తృచవిధానేన యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కుర్యాత్ ॥

(పిమ్మట క్రిందివిధముగా షోడశోపచారపూజను చేయవలెను)

క్రిందిశ్లోకములతో సూర్యభగవానుని ధ్యానించి, పుష్పాంజలి సమర్పించవలెను.

అథధ్యానమ్ : 1. ఉదయగిరిముపేతం భాస్కరం పద్మహస్తం
సకల భువన నేత్రం నూత్నరత్నోపధేయమ్ ।
తిమిరకరిమృగేన్ద్రం బోధకం పద్మినీనాం
సురవర మభివన్ద్యం సున్దరం విశ్వరూపమ్ ॥

2. నమస్సవిత్రే జగదేక చక్షుషే జగ త్ప్రసూతి స్థితి నాశ హేతవే ।
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరించి నారాయణ శంకరాత్మనే॥

3. సకుంకుమార్ఘ్యం సకుశంసపుష్పం సరక్తగన్ధం సహిరణ్యతోయమ్।
ఆదాయతేనాథ సహేమపాత్రం సమస్తమర్ఘ్యం భగవన్ప్రసీద ॥

4. ధ్యేయస్సదా సవితృమన్డల మధ్యవర్తీ నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః
కేయూరవాన్మకర కుండలవాన్కిరీటీ హారీహిరణ్మయ వపుర్ధృత శంఖచక్రః ॥

శ్రీపద్మినీ ఉషా ఛాయాసమేత శ్రీసవితృ సూర్యనారాయణ
పరబ్రహ్మణే నమః ధ్యాయామి ॥

## ఆవాహనమ్

క్రింది మంత్ర శ్లోకములచే సూర్య భగవానుని ఆవాహన చేయవలెను.

ఓం సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షస్సహస్రపాత్ ।
సభూమిం విశ్వతోవృత్వా । అత్యతిష్ఠద్దశాఙ్గులమ్ ॥

శ్లో॥ **ఆవాహయేజ్జగన్నాథం భాస్కరం విశ్వరూపిణమ్ ।**
**పద్మాసనం పద్మకరం పద్మగర్భ సమద్యుతిమ్ ।**
**సప్తాశ్వం సప్తరజ్జుంచ ద్విభుజం త్వాం సదా రవిమ్ ।**
**ఆవాహయామి దేవేశ సర్వాభీష్ట ఫలప్రదమ్ ॥**
**తవపూజాం కరిష్యామి జగన్నాథ నమోస్తుతే ॥**

ఓం భూర్భువస్సువః । ఓం హ్రాం ఉద్యన్నద్యమిత్రమహః ॥

హ్రాం ఓం మిత్రాయనమః । శ్రీపద్మినీ ఉషా ఛాయాసమేత శ్రీసవితృ సూర్యనారాయణ పరబ్రహ్మణే నమః ఆవాహయామి॥

## రత్నసింహాసనమ్

క్రింది మంత్ర శ్లోకములచే సూర్య భగవానునికి ఆసనము సమర్పించవలెను.

ఓం పురుష ఏవేదగ్ం సర్వమ్ । యద్భూతంయచ్చభవ్యమ్ ।
ఉతామృతత్వస్యేశానః । యదన్నేనా తిరోహతి ॥

శ్లో॥ **సూర్యమిత్ర సహస్రాంశో తేజోరాశే సురేశ్వర ।**
**సింహరాశి ప్రభోస్వామి న్యాసనం ప్రతిగృహ్యతామ్ ॥**

ఓం భూర్భువస్సువః । ఓం హ్రీం ఆరోహన్నుత్తరాన్దివమ్ ॥

హ్రీం ఓం రవయేనమః । శ్రీపద్మినీ ఉషా ఛాయాసమేత శ్రీసవితృ సూర్యనారాయణ పరబ్రహ్మణేనమః రత్నసింహాసనంసమర్పయామి ॥

## పాద్యమ్

క్రింది మంత్ర శ్లోకములచే సూర్య భగవానునికి పాద్యము సమర్పించవలెను.

ఓం ఏతావానస్యమహిమా । అతోజ్యాయాగ్ శ్చపూరుషః ।

పాదోఽస్య విశ్వాభూతాని । త్రిపాదస్యామృతందివి ॥

**శ్లో॥ కిరణై స్సర్వ తీర్థాని సమాకృష్య జగత్పతే ॥**

**వృష్టి ప్రదోఽసి లోకానాం పాద్యం స్వీకురు భాస్కర ॥**

ఓంభూర్భువస్సువః । ఓం హ్రూం హృద్రోగంమమసూర్య॥

హ్రూం ఓం సూర్యాయనమః ॥ శ్రీపద్మినీ ఉషా ఛాయాసమేత శ్రీసవితృ సూర్యనారాయణ పరబ్రహ్మణేనమః పాదయోఃపాద్యం సమర్పయామి ॥

## అర్ఘ్యమ్

క్రింది మంత్ర శ్లోకములచే సూర్య భగవానునికి అర్ఘ్యము సమర్పించవలెను.

ఓం త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః । పాదోఽస్యేహాభవాత్పునః ।

తతో విష్వఙ్వ్యక్రామత్। సాశనానశనే అభి ॥

**శ్లో॥ దేవై ర్మహర్షిభి శ్చైవ మునిభి ర్బ్రాహ్మణా దిభిః ।**

**త్వంహి పూజ్య స్త్రికాలా ర్ఘ్యై రర్ఘ్యం స్వీకురుభాస్కర ॥**

ఓంభూర్భువస్సువః । ఓం హ్రైం హరిమాణంచనాశయ ॥

